## ద్దల నాయెంకి

గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ
కూకుండ నీదురా కూసింత సేపు !

..............................

నాకాసి సూస్తాది నవ్వు నవ్విస్తాది,
మెల్లి మాటాడిస్తె యిసిరికొడతాదీ !
గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ !

..............................

కన్ను గిలికిస్తాది నన్ను బులిపిస్తాది,
దగ్గరస కూకుంటె అగ్గి సూస్తాదీ !
గుండె గొంతుకలోన కొట్లాడుతాదీ !

..............................

యాడుండమంటాది   యిలుదూరిపోతాది,
యిసిగించి యిసిగించి   వుసురోసుకుందీ !
గుండె గొంతుకలోన   కొట్లాడుతాదీ !

...............................

మందో మాకో యెట్టి   మరిగించినాదీ,
పల్లకుందామంటె   పాణ మాగదురా !
గుండె గొంతుకలోన   కొట్లాడుతాదీ !

...............................

*

౨

# వోనలచ్చిమి

జాము రేతిరి యేళ జడుపు గిడుపూ మాని
సెట్టు పుట్టా దాటి సేనులో నేనుంటె
మెల్లంగ వస్తాది నాయెంకీ!
సల్లంగ వస్తాది నాయెంకీ!

పచ్చన్ని సేలోకి పండు యెన్నెల్లోన
నీలి సీరాగట్టి నీటు గొస్తావుంటె
వోయ్యార మొలికించు నాయెంకీ!
వోనలచ్చి మనిపించు నాయెంకీ!

యెంకి వస్తాదాని యెదురూగ నేబోయి
గట్టుమీదా దాని కంటి కాపడగాన
కాలు కదపాలేదు నాయెంకీ!
కరిగి నీ రౌతాది నాయెంకీ!

మాటలన్నీ సెప్పి  మంచెకిందా కెల్లి
గోనెపట్టా యేసి  గొంగడీ పై నేసి
కూలాసగుంటాది నాయెంకీ!
కులుకు సూపెడతాది నాయెంకీ!

యేతా మెత్తేకాడ  యెదురూగ కూకుండి—
మల్లీ యెప్పటల్లె  తెల్లారబోతుంటె—
సెందురుణ్ణీ తిట్టు నాయెంకీ!
సూరియుణ్ణీ తిట్టు నాయెంకీ!

*

# యెంకిముచ్చట్లు

యెన్నాని సెప్పేది  యెంకి ముచ్చట్లు
యేటి సెప్పేది  నా యెంకి ముచ్చట్లు ?

దొడ్డి తోవ కళ్లె తొంగి సూడంగానె
'తోటకాడే వుండు తొరగొస్త' నంటాది !

యెన్నాని సెప్పేది............

యెంకి రాలేదాని యేటో సూత్తావుంటె
యెనకాలగా వచ్చి 'యెవురు వో'రంటాది!

యెన్నాని సెప్పేది............

'సిట్టి సేబా'సాని నిట్టూర మేత్తుంటె
మాటా యినబడనట్టు మరియేటో సెపుతాది !

యెన్నాని సెప్పేది............

‘కోడి గూ సేసరికి కొంపకెల్లాలి, నీ
కోసరమె సెపుతాను కోప మొ’ద్దంటాది!

యెన్నాని సెప్పేది............

‘యెంతసే పున్నాను యిడిసిపెట్టాలేవు
తగువోళ్ల లో మనకి తలవొంపు’ లంటాది!

యెన్నాని సెప్పేది............

యెన కెనకె సూత్తానె యెల్లుతావుంటాది,
యెన్నాని సెప్పేది యెంకి ముచ్చట్లు
యేటి సెప్పేది నా యెంకి ముచ్చట్లు?

*

# యెంకితో తిరపతి

యెంకీ, నాతోటీ రాయే!

మన

యెంకటేశరుణ్ణి యెల్లీ సూసొద్దాము!

ఆవుల్ని దూడల్ని
అత్తోరి కాడుంచి,
మూటా ముల్లీ గట్టి,
ముసిలోళ్లతో సెప్పి,

యెంకీ, నాతోటీ రాయే......

ఆ సామి మా దేటా
వూసూ లాడుకొంట,
కొండ మెట్లన్నీ నీ
కొంగట్టు కెక్కాలి,

యెంకీ, నాతోటీ రావే.....

'రేతిరి పగటేల
రెప్పెయ్య కెంకీని
సల్లంగ సూడ' మని
సామితో జెప్పాలి,

యెంకీ, నాతోటీ రావే.....

*

5

# సత్తైకాలపు నాయెంకి

"నీతోటె వుంటాను నాయుడు బావా!
నీమాటె యింటాను నాయుడు బావా!"

"సరుకు లేమి కావాలె సంతన పిల్లా?"

"నువ్వు
మరమమిడిసి మనసియ్యి నాయుడు బావా!"

"సక్కదనము కేమిత్తు సంతనపిల్లా?"

" నువ్వు

నల్లగుండు పద్దాక నాయుడు బావా!"

" యేడనే నీ కాపురమో యెల్తురు పిల్లా?"

" నీ

నీడలోనే మేడ కడతా నాయుడు బావా!"

" నీతోటె వుంటాను నాయుడు బావా!

నీ మాటె యింటాను నాయుడు బావా!"

*

6

# దూరాన నాయెంకి

యాడుంటివే, యెంకి, యాడుంటివే ?

పూతోరి పందిట్లో
సీతాయి యెల్తుంటె
నీ తళుకు గేపకాన
నా తల తిరిగిందోలె !

యాడుంటివే, యెంకి, యాడుంటివే ?

మామిడి తోట కెల్లి
మంచీ పండోటి గోసి,
    యేటోగాని, నోట్లేస్తె
    యిసమై పోయిందోలె !
యాడుంటివే, యెంకి, యాడుంటివే ?

పొత్తేళ జొన్నసేలో
సిత్తరమై పోతాది,
    గుమ్మైన వోసనొస్తే
    గుండెగిరిపోయె నోలె !
యాడుంటివే, యెంకి, యాడుంటివే ?

*

7

# ఏటిదరి నాయెంకి

'యీ శేతి రొక్కా తెవు  యే మొచ్చినావే?'

'ఆడు నే నిక్కాడే ఆడినామమ్మా!'

'యేటి నురగల కేసి  యేటి సూశేవే?'

'మా వోడి మన సట్టె మరుగుతాదమ్మ

'సెంద్రవొంకలో యేమి సిత్ర మున్నాదే?'

'వొంక పోగానె మావో డొస్తడమ్మా!'

"ఆడు నే నిక్కాడే ఆడినా మమ్మా!
మావోడి మనసట్టె మరుగుతాదమ్మా!
ఆ వొంక పోగానె ఆడొస్త డమ్మా!"

# రావొద్దె!

రావొద్దె నాపక్క రావొద్దె యెంకీ!
ఆ పొద్దె మనపొత్తు లయిపోయెనెంకీ!

నీ మీద పాణాలు నిలుపు కొంటా వొచ్చి,
అద్ద రేతిర్లోన అడివంత తిరిగాన!!
రావొద్దె......

గట్టెక్కిసూశాను! పుట్టెక్కి సూశాన!
కల్ల కపటము లేని పిల్ల వను కున్నాన!!!
రావొద్దె......

యేడ నువ్వుండావో యేళ్లన్ని యాదాన!!!!
యేటి సేస్తుండావో యీశ్వరు ణ్ణడిగాన!!!!!
రావొద్దె......

# మాయదారి తమ్ముడు

(కృష్ణుడు)

నా సిన్ని తమ్ముణ్ణి నాకియ్యరయ్యో !
యేడుకొండలవోడ ! యెంకటేశ్వరుడా !
ఇంతోళ్ల మప్పాదు యీడ నిలుసుంటేని
నన్ను తరిమేసి మావోణ్ణి దాశావంట !

నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్యరయ్యో !
యేడుకొండలవోడ ! యెంకటేశ్వరుడా !
'యీ సరికి మరిదీని నేసూడలే'దాన్ని,
యెంకి కూడా నిన్ను యేడుకోవొచ్చింది!

నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్యారయ్యో !
యేడుకొండలవోడ ! యెంకటేశ్వరుడా !

'పిల్లోణ్ణి వోపాలి బేగి తెమ్మన'మాని
మాయమ్మ రేతిరి మరిమారి సెప్పింది'

నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్యారయ్యో !
యేడుకొండలవోడ ! యెంకటేశ్వరుడా !

మావోళ్లు సూశాక మల్లీ నీ కిస్తాను!
నా సిన్ని తమ్ముణ్ణి నా కియ్యారయ్యో !
యేడుకొండలవోడ! యెంకటేశ్వరుడా !

*

# నాయెంకి

నన్నిడిసిపెట్టెల్లినాడే,

నారాజు,

మొన్న తిరిగొస్త నన్నాడే!

నీలు తేబోతుంటె, నీతోడె—వోలమ్మి!
నా యెంటె యెవరోను నడిసినట్టుంటాదె!
నన్నిడిసిపెట్టెల్లినాడే,

నారాజు......

అద్దములో సూత్తుంటె అదియేటో సిగ్గమ్మి!
నా యెనక యెవరోను నవ్వినట్టుంటాదె!
నన్నిడిసిపెట్టెల్లినాడే,

నారాజు......

నల్లన్ని యెన్నట్లో సాపేసి కూకుంటె—
ఒట్టమ్మి—వొల్లంత ఉలికులికి పడతాడె !
నన్నిడిసిపె ట్టెల్లినాడే,

నారాజు......

నీత్తైనవోడె, నా రాతెట్ట గుంటాదో !
కళ్లల్లో సత్తెముగ కట్టిన ట్టుంటాడె !!!
నన్నిడిసిపె ట్టెల్లినాడే,

నారాజు,

మొన్నె తిరిగొస్త నన్నాడే!!!

*

11

# నమిలి మింగిన నాయెంకి

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!

మెళ్లో పూసలపేరు,
తల్లో పూవులసేరు,
కళ్లెత్తితే సాలు
కనకాబిసేకాలు!

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!

సెక్కిట సిన్నిమచ్చ,
సెపితే సాలదులచ్చ!
వొక్కనవ్వే యేలు
వొజ్జిర వొయిడూరాలు!

యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!

పదమూ పాడిందంటె
పాపాలు పోవాల!
కతలూ సెప్పిందంటె
కలకాల ముండాల!
యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!
తోటంతా సీకట్లె!
దొడ్డీ సీకటిమయిమె!
కూటికెళితే గుండె
గుబగుబమంటా బయిమె!
యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!
రాసోరింటికైన
రంగుతెచ్చే పిల్ల!
నా సొమ్ము—నా గుండె
నమిలి మింగిన పిల్ల!
యెంకి వొంటి పిల్ల లేదోయి లేదోయి!
యెంకి నా వొంకింక రాదోయి రాదోయి!

*

12

# కటిగ్గుండెల నాయెంకి

నీవెల్లిపోయినావంటే,
　　　　　　పచ్చినై,
నేనేటో కొట్లాడుతుంటే;
　　　　　　　　　　యిరుగమ్మలక్కలతో నీవా
　　　　　　　　　　　　　　　　నాయెంకి,
　　　　　　　　　　యెకసక్కె మాడుతున్నావా!

నిన్ను రచ్చించ మంటానే
　　　　　　పద్దాక,
మొన్నొ దణ్ణాలు పెట్టేనే!
　　　　　　　　　　వొన్నెసీరలు గట్టి నీవా,
　　　　　　　　　　　　　　　　నాయెంకి,
　　　　　　　　　　వొసుగా తిరుగుతున్నావా!

పొద్దత్తమానాలు కాదే
నీవూసె,
వొద్దన్ననూ మరుపురాదే!
అమ్మలక్కలతోటి నీవా,
నాయెంకి,
సెమ్మసె క్కాడుతున్నావా!

కేతిర్లో మనతోటకాడా,
వొక్కణ్ణి,
నా తిప్ప లీశ్వరుడు లేడా!
సీకు సింతాలేక నీవా,
నాయెంకి,
పోక్లై పొందుకున్నావా!

*

# తోటవ్రాసు

తోటవ్రాసంటే సికాకూ,
యెంకి
తోటి యెల్లే దాని సోకూ!
బంతీ సేమంతంట్ల
పరువంతా మాసింది;
మల్లెంటు మెల్లంగ
మారుమొగమేసింది!
తోటవ్రాసంటే సికాకూ,
యెంకి.........

తూర్పేపు మళ్లేటి,
దుబ్బు దుట్రాయేటి;
అంటు మామిళ్లేటి,
ఆవారస పళ్లేటి!
తోట వ్రాసంటే సికాకూ,
యెంకి.........

గొడ్డూగోదా బెంగ
గొని సిక్కిపోనాయి;
గడ్డిమేటిని సూత్తె
కడుపే సెరువౌతాది !

తోటవ్వూసంటే సికాకూ,
యెంకి.........

నూతికాడే సోకు
యేతాముదే సోకు;
పోయి 'పాడో' యంటె
'వో' యంట పలికేని !

తోటవ్వూసంటే సికాకూ,
యెంకి.........

బలము సీదాపోయి
బడుగున్నై పోనాను;
కుష్టా రామా యంట
కూకోవలి సొచ్చింది!

తోట వ్వూసంటే సికాకూ,
యెంకి.........

*

14

# యెంకితో బద్రాద్రి

ఆడ నీ సుక్కాని యీడ నే గెడయేసి
పడవెక్కి బద్రాద్రి పోదామా!
బద్రాద్రి రాముణ్ణి సూదామా!

గోదారి గంగలో కొంగుకొంగూగట్టి
కరువు తీరా బుటకలేదామా!
సరిగంగ తానాలు సేదామా!

కొత్తమడతలు కట్టుకోసి పెజలోకెల్లి
'రామన్న రాముడో' యందామా!
రామకతలే పోయి యిందామా!

సంబరము కెదురుంగ జంటగా నిలుసుండి

సామివోరికి దణ్ణమెడదామా!

సాపసుట్టుగ నేల బడదామా!

ఈడ నీ సుక్కాని ఆడ నే గెడవేసి

పడవెక్కి మనపల్లె కెడదామా!

బద్రాద్రి రాముణ్ణి యిడదామా!

*

15

# యెల్లి సరదాలు

యెంకి వస్తాదాని
యెదురు తెన్నులు కాసి,
దిగులుబెట్టి, తలదించి,
తిరిగి సూసేతలికి—
మెంకిరావాలి! నాయెదర నిలవాలి!
కులుకుతా నన్నేటొ పలకరించాలి!

పిల్ల పొరుగూరెల్లి
మల్లి రాలేదాని,
వొల్లంత వుడుకెత్తి
వొక్కణ్ణె పొడుకుంటె—
ఘల్లుమంటా యెంకి కాలు పెట్టాలి!
'మెల్లి వొచ్చా' నంట యెంకి నవ్వాలి!

యెంకి కోపా లొచ్చి
యే దేశమో పోయి,
కల్లో నా కాపడితె
కల్లు తెరిసే తలికి—

తళుకుమని యెంకి నాదరికి రావాలి!
'నిదర కా బో'సంటు నింద లాడాలి!

*

16

# యెంకి సూపు

పదిమందిలో, ‘ యెంకి
పాట ’ నే పాడంగ
గోడసాటున యెంకి గుటక లేసే యేళ,
సూడాలి నాయెంకి సూపు లాయేళ !
సూడాలి నాయెంకి సోద్దె మాయేళ !

‘ నా పాటె పా’టంట
‘ నా మాటె మా’టంట
నలుగు రమ్మలు సేరి నను మెచ్చుతావుంటె,
సూడాలి నాయెంకి సూపు లాయేళ !
సూడాలి నాయెంకి సోద్దె మాయేళ !

పొరుగమ్మతో నేను

వారస లాడే యేళ,

పొలమెల్లి నే పొద్దుపోయి వచ్చే యేళ,

సూడాలి నాయెంకి సూపు లాయేళ !

సూడాలి నాయెంకి సోద్దె మాయేళ !

*

## యెంకి పయనం

పడుకుంటె నా కేటో బ్రమ పుట్టినాదీ!
కడుపులో సెయ్యేసి కలిపేసినాదీ!

ఎడతెగని జలమంట!
నడమ నో పడవంట!
పడ వెక్కి నాయెంకి పయన మయ్యిందంట!
పడుకుంటె......

యెంకేటో బ్రమపుట్టి
యెనక తిరిగిందంట!
సందెగాలికి పడవ సాగిపోయిందంట!
పడుకుంటె......

నీటిగాలికి వొంకి
పై తెగురుతాదంట !
పడిపోయిన ప్లేటో పడ వెల్లినాదంట !

పడుకుంటె......

పిల్లసిగలో పూలు
క ళ్లిప్పినాయంట !
మిడిసిపాటున దోనె మీరిపోయిందంట !

పండుకుంటె......

మెడసాటు పూసోటి
మినుకుమంటాదంట !
పంతాన గంతేసి పడవ పోయిందంట !

పడుకుంటె......

అంసల్లె, బొమ్మల్లె,
అందాల బరిణల్లె,
సుక్కల్లె, నావొంకి సురిగిపోయిందంట !

పడుకుంటె......

*

# యెఱ్ఱి నాయెంకి

'యెనక జల్మములోన
యెవరమో' నంటి!
సిగ్గొచ్చి నవ్వింది
సిలక_నాయెంకి !

'ముందు మనకే జల్మ
ముందోలె' యంటి !
తెల్ల తెలబోయింది
పిల్ల_నాయెంకి !

'యెన్నాళ్లో మనకోలె
యీ సుకము ' లంటి !
కంట నీ రెట్టింది
జంట_నాయెంకి !

*

17

# కనుబొమ్మ

నన్ను తెలుసుకు మొంకి కన్నుమూయాలి !
కనుబొమ్మ సూడాలి!
కరిగి పోవాలి!

నన్ను కలలో సూసి నవ్వుకోవాలి!
కనుబొమ్మ సూడాలి!
కరువు దిరాలి!

నిదరలో సిగపూలు సదురుకోవాలి !
కనుబొమ్మ సూడాలి!
కమ్మగుండాలి !

పిలు పదో యినగానె తెలివిరావాలి!
కనుబొమ్మ సూడాలి!
కతలు తెలియాలి!

*

౨౭

# సాలు! సాలు!

మనిసే సాలు! మనిసి మాటే సాలు!
మనిసి వాసనె సాలు! మనసే సాలు!

ఏతాము కెదురుంగ యెంకుంటె సాలు!
వొంటరిగ సిటికేసి కుంటకలిపేను!!
మనిసే సాలు!......

యెంకి సందల గలగ లినబడితె సాలు!
కళ్లు మూసుక నీరు మళ్ల కెత్తేను!!
మనిసేసాలు!......

యెంకి గా లోకపాలి యిసిరినాసాలు !
తోటంత రాజల్లె తోవ్విపోసేను !!
మనిసే సాలు !......

అందాల నాయెంకి వుఁదంటె సాలు !
నిబ్బరముగా రేత్రి నిదరపోయ్యేను ! !!
మనిసే సాలు !......

*

౨౧

# ఆకాలపు నాయెంకి

దూరాన నారాజు కే రాయిడౌనో!
ఈ రోజు నారాత లే రాలపాలో!

సిమ సిటుకనగానె
సెదిరిపోతది మనసు-
కాకమ్మసేతైన కబురంప డారాజు
దూరాన నారాజు కే రాయిడౌనో!...

కళ్ల కేటో మబ్బు
గమ్మిన ట్టుంటాది-
నిదరల్లె నావొల్లు నీరసిస్తున్నాది
దూరాన నారాజు కే రాయిడౌనో!...

ఆవు 'లంబా' యంట

అడిలిపోతుండాయి.

గుండెల్లో వుండుండి గుబులు బిగులాతాది

దూరాన నారాజు కేరాయిడౌనో!...

తులిసెమ్మ వొరిగింది,

తొలిపూన పెరిగింది-

మనసులో నా బొమ్మ మసకమస కేసింది

దూరాన నారాజు కేరాయిడౌనో!...

*

# ఉత్తమా యిల్లాలు

ఉత్తమా యిల్లాలి నోయా!
నన్నుసురుపెడితే దోస మోయా!

నిదరలో నిను సూసి సెదిరెనేమో మనసు!
పొరుగు వోరంత నా సరస కురికారంట !
ఉత్తమా యిల్లాలినోయా!......

'ఏలనే నవ్వ'ంట! 'ఏడుపేలే' యంట !
పదిమంది-ఆయింత పగల బడి నారంట !
ఉత్తమా యిల్లాలి నోయా!......

గాలెంట వోయమ్మ ! దూళెంట వోయమ్మ !
యిరుగు పొరుగో రంత యిరగ బడి నారంట !
ఉత్తమా యిల్లాలి నోయీ!......

యీపూడి వోకతెట్టె! యీపిం కోకతె తట్టె!
నిలు సిలికే దోకతె! నిలిసి సూ-సే దోకతె!
ఉత్తమా యిల్లాలి నోయీ !......

సాటునుండే యెంకి సబకు రాజేశావ్?
పదిమంది నోళ్ళల్లో పడమంట రాశాడ ?
ఉత్తమా యిల్లాలి నోయీ !......

## పిల్లోడు

యెంకితో తీర్తాని కెల్లాలి,
సంకలో పిల్లోడు సంబ్రాలు పడుతుంటె!
యెంకితో తీర్తాని కెల్లాలి!

నెత్తి మూటల నెత్తుకోవాలి!
కొత్త మడతలు దీసి కట్టాలి!
అడివిదారులయెంట నడవాలి!

బరువు మారుసుకొంట పక్కన్న నవ్వాలి!
యెంకితో తీర్తాని కెల్లాలి!

తాతనాటీ వ్రాసు తలవాలి !
దారిపొడుగున కీసు లాడాలి !
'తప్పు నీదే' యంట దెప్పాలి !
    దైభ మున్నాడాని ధడిపించుకోవాలి !
    యెంకితో తీర్తాని కెల్లాలి !

కత కాడ కూసింత నిలవాలి !
కతగాడు మావ్రాసె జెప్పాలి !
నను జూసి పిల్లోడు నవ్వాలి !
    మా లోన మామే టూ మతులిరుచుకోవాలి !
    యెంకితో తీర్తాని కెల్లాలి !

కోనేటిలో తాణ మాడాలి !
గుడి సుట్టు ముమ్మార్రు తిరగాలి !
కోపాలు తాపాలు మానాలి !
    యిద్దరము పిల్లోణ్ణి యీశుడికి సూపాలి !
    యెంకితో తీర్తాని కెల్లాలి !

*

24

# ముందు పుటక

నాపక్క తిరిగి మాటాడవా? యెంకి!
యీ సిక్కు నీవిప్పగలవా?

యీజంట విడిపోయి
యేవాడనో తేలి,
యెంకిపా టినగాన
యెదర నిలిసేదెవరో?
నాసూపు
సెదరగొట్టేదెవరో?
నాతోవ
సదును సేసేదెవరో?
నాపక్క తిరిగి మాటాడవా?....

మన సేతితో నాటి
మన సొంతమని పెంచి
మనకోట యీతోట
మరుపు రాకుంటాద?
నాగుండె
మరిగిపోకుంటాదా ?
నాపక్క తిరిగి మాటాడవా?......

వోయికుంటమే నీతో
వోరుగుతాదని నమ్మి
కలిసున్న నాకాసి
కన్నెత్తి సూసేవ?
నీవోన్నె
సిన్నేలు సూపేవ?
యింతింత
అన్నేయ ముంటాదా?
నాపక్క తిరిగి మాటాడవా?......

*

# పంట సేలకే పయనం

యీ యేపు నోయావు ఆయేపు నోయావు
జోడావులకు నడుమ నాయెంకి,
యీడు
జోడుగా నిలుసుంటె నాయెంకి,
ఆట
లాడతా కలిసుంటె నాయెంకి,
నన్నె
సూడ మన్నట్టుండు నాయెంకి !

ఈయేపు నోయేరు ఆయేపు నోయేరు
యేళ్ల రెంటికి నడుమ నాయెంకి
తలను
పాలకడ వెత్తుకొని నాయెంకి,
సేత
పూలు పుణుకుకొంట నాయెంకి,
పూల
బూరవోయిస్తాని నాయెంకి,
నన్నె
పోలుండుమంటాది నాయెంకి !

యీకాడ నోకొండ ఆకాడ నోకొండ
కొండకోనల నడుమ నాయెంకి,

పాల
కుండ దించుకోని నాయెంకి,

గుడికి
దండ మెడతావ్రంటె నాయెంకి,

సూడ
రెండే కళ్లనిపించు నాయెంకి!

ఈసాయ నోసేను ఆసాయ నోసేను
సేలరెంటికి నడుమ నాయెంకి,

పాలు
పూలు నా కందిచ్చి నాయెంకి,

'సామ్ము
లేల మన' కంటాది నాయెంకి,

గుండె
జాలి పుట్టిస్తాది నాయెంకి!

*

# సాటేలా ?

సాటేలా ? నీకు మాటేలా? సిన్నతనమేలా? సిగ్గేలా?

ఆ సీమ యీ సీమ అందరందాలు
తిన్నంగ నినుసూసె దిద్దుకోంటారు!
సాటేలా? నీకు మాటేలా?......

ముందు మన పాపణ్ణి
కింద దిగనీరు,
యెంకి కో వంటారు
యెత్తుకోంటారు !
సాటేలా? నీకు మాటేలా?......

యెం కొక్క దేవత్తై
యెలిసె నంటారు-
యింటింట పెడతారు
యెంకి నీపేరు!
సాటేలా? నీకు మాటేలా?......

*

# దీపం

ఆరిపేయవె దీపమూ!

వెలుగులో నీమీద - నిలపలేనే మనసు!

ఆరిపేయవె దీపమూ!

జిమ్ముమరటా తోట

సీకటై పోవాలి,

సీకట్లో సూడాలి

నీ కళ్ల తళతళలు!

ఆరిపేయవె దీపమూ!......

తళుకుతో నీరూపు
తలుసుకొని తలుసుకొని
సీకట్లో నాకళ్లు
సిల్లులడ సూడాలి!

ఆరిపేయవె దీపమూ!......

సూపులే ఆపేసి
రూపు వ్రాసే మరిసి
వాక రెరుగ కింకొకరు
వారిగి నిదరోదాము!

ఆరిపేయవె దీపమూ!......

*

# కనుపాప

అద్దమే లంటాది అందాలు తెలప
ముద్దుమాటల కెంకిదే ముందు నడక!
అద్దమే లంటాది అందాలు తెలప !......

కంటెదర నాకాడ కనిపాపలోనీడ
సూసుకొంటా నొసట సుక్కెట్టుకుంటాది !
అద్దమే లంటాది అందాలు తెలప !......

కనిపాపలో నీడ గని నవ్వుకుంటాది
మొకము సిటిలిస్తాది రకరకము లవుతాది!
అద్దమే లంటాది అందాలు తెలప!......

కంటిదరి నాకాడ కంట నీ రెడతాది
కనిపాపలో నీడ మన సదరగొడతాది!
అద్దమే లంటాది అందాలు తెలప!......

*

# ముందుగతి

ఎక్కవే! కొండ నెక్కవే!
నా సక్క నెంకీ ఎక్కవే!
కొండ నెక్కవే!

పక్కసూపులు మాని
పయి కెల్లిపోదాము!
ఎక్కవే! కొండ నెక్కవే!

ముందు నువ్వుంటే నే
కిందా నిలబడగలను
నీ నీడనే తొక్కు
కొండ సులువుగ రాగల
నెక్కవే! కొండ నెక్కవే!

నాలు గడుగు లేసి
నవ్వుతో పిలు వెంకి!
పిలుపు నవ్వే నాకు
ములుగఱ్ఱ కాగలదు!
ఎక్కవే! కొండ నెక్కవే!

తెల్లన్ని నీపైట
సల్లంగ యిసురోలె!
ఆగాలి నాకాలి కట్టె
బగబగమండు

నెక్కవే! కొండ నెక్కవే!

పదిమెట్లు పయికెల్లి
పల్లకుండా సూడు—
పగబట్టు పామల్లె
పయికి సర్రున వత్తు

నెక్కవే! కొండనెక్కవే!

యెల్లెల్లి పయికెల్లి
ఋద్దరము కలిసి
మూటాలివతలపెట్టి
మునిగిపోదము పైనే

యెక్కవే! కొండ నెక్కవే!

*

# గోవుమాలచ్చిమి

గోవుమాలచ్చిమికి కోటి దణ్ణాలు,
మనిసికైనా లేని మంచి పోకిళ్లు !

మొంకితో కూకుండి
యింత నాపుతుంట్యే
తనతోటి మనివల్లె
తల తిప్పుతాదీ!

గోవుమాలచ్చిమికి కోటి దణ్ణాలు......

వొంకి సరసాలాడ

జంకుతా వ్రుంటే,

సూసి సూడక కన్ను

మూసి తెరిసేదీ!

గోవుమాలచ్చిమికి కోటి దణ్ణాలు.....

కూరి కూకుని నేనె

పోరు పెడుతుంటే,

తల్లి డిప్ప పిల్లల్లె

తెల్లబోతాదీ !

గోవుమాలచ్చిమికి కోటి దణ్ణాలు.....

# పడవ

ఆపలేనే యెంకి యీ పడవ యిసురు!
పాడలేనే యెంకి పదము లీ రొాడలో!

పడవ సల్లగ నడిపి
పదము సదు వంటాావు!
కన్నుమంటా యేరు
గాలి నెగబోసింది!
ఆపలేనే యెంకి యీ పడవ యిసురు!......

వోరుగాలే పాట
దారి కడతావుంది!
జేటి కురికే పాట
నోట గొాడతావుంది!
ఆపలేనే యెంకి యీ పడవ యిసురు!......

తల మలుపుకోని పాట

తరిలింది కామోసు!

దేముడల్లే లోనె

తిరుగుతున్నా డేటో!

        ఆపలేనే యెంకి యీ పడవ యిసురు!.....

యెన్నెలంటే పాట

కెంత మనసవుతాదో!

పాట సాగేతలికి

పయనమే మవుతాదో!

        ఆపలేనే యెంకి యీ పడవ యిసురు!.....

*

# ముత్యాలపేరు

అద్దములో, నారాజ,
అంతనీరూపు!
ఇంత ముత్తెములోన
యిరికె నేలాగు?
ఇన్ని పొంకాలున్న యెంకివే నీవు!
ఇంత నాగుండెలో యిమిడిపోలేద్రా?

వోసూపె, వోరూపె,
వోనవ్వో రాజా
యిన్నింట వోపాలె
యెటు సెదిరినాదో?
మాటలో, మనసులో, మంచిలో—యెంకీ!
సొగసు నీ వోసారె అగపడవ నాకూ?

అటుతీరగ విటుమసల

వామరమ మేటో !

ఆణిముత్తెములోన

ఆడిపోతావే ?

కునుకల్లె, సినుకల్లె, కూకుండె యెంకీ !

కనబడకె మనసులో గంతు లేయవటే ?

*

# ఆనాటి నావోడు

ఆనాటి నావోడు సెందురూడా,
అలిగి రాలేదోయి సెందురూడా!

'యెంకి! మన మిద్దరమె
యెవ్వరో' ద్దన్నాడు;
'యీసేలు యీతోట
లింక నీ'వన్నాడు—
మాటాడుతుండంగ సెందురూడా!
మంచిదా పోయేవు సెందురూడా!!

'కలకాల మీదినమె
నిలుసు మన' కన్నాడు;
'గాలికైనా తాను
కవుగి లీ' నన్నాడు—
ననుసూసి నవ్వేవు సెందురూడా!
నాయమా నాముద్దు సెందురూడా!

నాకాసి సూశాడు
నీకాసి సూశాడు;
'మద్దె సెంద్రుడె మనకు
పెద్దమని' సన్నాడు—
కన్నీరు నీకేల సెందురూడా!
కనికారమే శాన సెందురూడా!!

*

# సుక్క

సుక్కెక్కడున్నాదో సూడవే చెల్లీ!
బారెడైనా కొండ పైకి సాగిందేమొ!
    సు క్కెక్కడున్నాదో సూడవే చెల్లీ!......

తాను నిలిపిన గడువు
దాటి పోనేలేదు——
కాలు సేతులు పక్క
కంటుకొని పోనాయి!
    సు క్కెక్కడున్నాదో సూడవే చెల్లీ!......

సుక్కతోనే కొండ
లెక్కెత్తు నన్నాడు——
మబ్బో, మనిసో, కొండ
మలుపు పరకాయించి!
    సు క్కెక్కడున్నాదో సూడవే చెల్లీ!......

వొకటొకటిగా మెట్లు
వొదిగి దిగిరావాలి—
తోటమొలపల గలగ
లేటొయిన నీవమ్మ!
సు క్కాక్కడున్నాదో సూడవే చెల్లీ......

నా సొగుసు నన్నైన
సూస్టుకోనీడమ్మ—
ఆవు మెళ్లో మువ్వ
లట్టై మోగినవేళ!
సు క్కాక్కడున్నాదో సూడవే చెల్లీ......

# వృత్తమాటలు

'వృత్తమాటలు నీవి పో' మ్మందిరా,
మొంకి
'కొత్త పాటలు పాడుకో'మ్మందిరా

వూరెల్త నని పలికి
మారేస మేసుకొని
'సకినాల పా టొచ్చు
సకిన మడు' గన్నాను—
'వృత్తమాటలు నీవి పో'మ్మందిరా
..............................

'యీా రోజు నీ రాజు
వూరెల్లి నా' డంటి,
'యేరాపులోరూపు
మారిపోయిం' దంటి—
'వృత్తమాటలు నీవి పో'మ్మందిరా
..............................

'మొదల మీా రీయేటి
మొగనె కలిశా' రంటి
'మెరుపల్లె పొటెత్తి
మురిపించి నా' డంటి
'వుత్తమాటలు నీవి పో'మ్మందిరా

..................................

కొద్దిలో వొరహాల
గొముకు నెత్తేవంటి
యీనిజము తేలేకె
యీనాము లిమ్మంటి
వుత్తమాటలు నీవి పో'మ్మందిరా,
మెంకి
'కొత్తపాటలు పాడుకొ'మ్మందిరా.

# స్వ ర ము లు

---

## ౧. బిలహారి — ఖండ-ఏక.

| | | | |
|---|---|---|---|
| సాదసా | సనిదాప | పదపామ | గరిసా[3] |
| గుండెగోం | తుకలోన | కొట్లాడు | తాదీ |
| సారిగ | గాదపద | గదపామ | గరిసా[3] |
| కూకుండ | నీ దురా | కూ సిం త | నే పు |
| సాసాస | సాసారి | నీసనిద | పాపాప |
| నాకాసి | నూస్త్రాది | నవ్వు న | వ్వి స్త్రాది |
| పదసపద | సనిదాప | పదసదప | మగరిసా |
| యెల్లిమా | టా డిస్తై | యిసిరికొడ | తా దీ |

## ౨. బ్యాహాగ్ ఖండ-ఏక

| | | | |
|---|---|---|---|
| సాససా | సససారి | నినిసనిద | పాపాప |
| జామురే | తిరియేళ | జడుపుగిడు | పూమాని |
| పాససా | సనినిదప | మపదమప | గపమ౦గమగరిసా |
| సెట్టుపు | ట్టా దా టి | నే ను లో | నే ను ం టె |

పదదరిసా సని నిదపా పామ మదపా మపమాగా
మె ల్లం గ వ స్తాది నా యొ ం

గామగ రిసనీసా
కి

సగామ పగమాగ గా ౯పమప గమగరి సా
సల్లంగ వ స్తా ది నా యొం కి

## 3. నాదనామక్రియా-ఖండ-ఏక.

సరిమామ మాగామ పాదపమ గరిసా
యె న్నాని సె ప్పె ది యెంకి ము చ్చ ట్లు

సారిసని సారిపమ గామగరి సాసా
యేటిసె ప్పేదినా యెంకి ము చ్చ ట్లు

మామగమ పదపాప పదదప మ పాపాప
దొ డ్డి తో వ కళ్ళె తొంగి సూ డం గానె

మామమా మామగమ పదపమమ గరి రిస నిని
తో ట కా డే వుండు తొరగొ స్త నం టా ది

## ४. ఘరజు చతుశ్ర-ఏక.

సగాగమ పదామ పా గమ పసనీద పమ
యెంకీ నా తోటీరా యే మన యెంక చేశరుణ్ణి

గమ దా పమ గరి సా సని
యె ల్లీ సూ సా ద్దా ము

దపద నిసాస పస్సాస నిద నీస ససాస నిద
ఆవుల్ని దూడల్ని అత్తోరి కా డుంచి మూటాము ల్లే

పాపమ పదపాపమ గరిసాని
గ ట్టి ముసిలోళ్ల తో సెప్పి

## ౫. మోహన-చతురశ్ర-ఏక.

త్రి
పద సాస సద పాప పద సద సస దప గరి
నీ తోటె వుం టాను నా యుడు బా వా

త్రి
దసారి దప గారి రిగరి సనా సా
నీమాటె యింటాను నాయుడుబా వా

## ౬. కాఫి-చతురశ్ర-ఏక.

సని సారి రిరిగ మప గామగ రిస సారీ రిసనీ
యా డుంటి వేయెం కి యాడు ంటి వే

పస స ని స రి రిగ పమ గామగ రిసనీ సా
యా డుంటి వే యెం కి యా డుం టి వే

స సాస సపాస నీసని దప పాపమ గమ
పూతోరి పందిట్లో సీతా యి యెల్తు ంటె

త్రి
గాగగగా గామ గామ పదదపపమ గరిసనిసా
నీ త ళు కు గేప కాన నాతల తిరి గిందో లె

## ౭. పూరికళ్యాణి-ఖండ-ఏక.

దపసాస సారిసని సరిగరి రిస సా సని దానిద దప మాగా
యీా రేతి రొక్క తెవు యే మె చ్చి నా వే

సాసనిద పా దప మగరిగ గాదప పమ గరిగా పమగరి సా
ఆడు నే ని క్క డే ఆ డి నా మం మా

## ౮. ఆనందభైరవి-ఖండ-ఏక.

పనిసారిస నిదపామ గామాపమ గరిసనీ
రా వద్ద నా ప క్క రా వొ ద్దె యెం కీ

నీసా గరి గగ మా పమ గరిగరిస సాసా
ఆ పొద్దు మన షొ త్తు లయిపోయె నెం కీ

పాపనిపప   నీసాస   ససమగరి   సనిసాస
నీ మీా ద   పాణాలు   నిలుపుకోం   టా వచ్చి

పాసరిస   నిదపామ   గమపామ   గరిగామ
అద్దరే   తి ర్లొనె   అడి వం త   తిరి గా నె

## ౯. ఆనందభైరవి ఖండ-ఏ.

8-వ పదం మాదిరియే పాడవలయును.

## ౧౦. నాదనామక్రియ-ఖండ-ఏక.

దాససస   సారిస్సరి   రిపమా మా   గప్రమా గారీసని
న న్నిడిసి   పెట్టె ల్లి   నా   డే   నా   రా   జు

సరిగగ   మాపమ గరి   గ రి సా   సా
మొన్నె తిరి   గొ స్త న   న్నా డే

పదపా మగమా   పనిదా పాద   పద సాస   నిదపాదమా
నీ లు తే   బో   తుం టె   నీ   తోడె   వో ల   మ్మి

మమామ   మమగామ   పపదపమ   గమపమ   గరిసని
నాయెంటె   యెవు రోను   నడిసి న   ట్టు   ం   టా   దె

## ౧౧. ముఖారి-ఖండ-ఏక.

రీమ పా దాపాప మప మద పమ గరిసాస
యెంకి వొం టి పి ల్ల లే దో యి లే దో యి

సాససని సరిరిపమ గరిగరిస సాసాస
యెంకినా వొం కిం క రాదోయి రాదోయి

రిమ మగ్గ గరి రిససాసా రిమ మరి రిమ పప పాద (పాప
మె ల్లో పూ సలపేరు త ల్లో పూ వుల సే రు (సేరు)

సా సా స స నిని దప మపని దప మ గగ రిస
క ల్లె త్తి తే సా లు కనకా బి సే కా లు

యెంకివంటిపిల్ల.

## ౧౨. నాదనామక్రియ-ఖండ-ఏక.

సాసాస సారి సరి మామా మా దప పమగా
నీ వె ల్లి పోయినా వం చే ప చ్చి నై

రిమ పద ద పద దపమామా మప పమ గా
నే నే టూ కొ ట్లా డు తుం చే

సససాస సరి సరి రిప పమప గామగ రిససాసా
ఇరుగమ్మ లక్కాలతో నీ వా నా యెం కి

సరి గా పమ గాపమగరి సాసా
యెక స క్కె మాడు తుం న్నావా

## ౧౩. మాయామాళవగౌళ-ఖండ-ఏక.

స్సాసా నిదపామ గరిగామా గామ
తోటవూ సం చే సి కా కూ రొంకి

పద్ద నిద పమ గరి గమ పమ గరి సా
తో టి యె ల్లె దా ని సో కూ

మిశ్రం

దా పాదా సా సాసా సరిగరి సా నిదాసాసా
బం తీశా మం తంట్లు పరువం తా మా సిం ది

సాసాసా నిదా పమ గమ పదా దప పమ గరీగామా
మ ల్లెంటు మె ల్లం గ మా రు మొగ మే సిం ది

తోటపూసంచె.

## ౧౪. కేదారగౌళ-ఖండ-ఏక.

రిమ మమగ రిగసాస రీమపస నిదపాప
ఆ డ నీ సుకొ్కని యీాడనే గడయేసి

మపసారి సానిదపప మమ పదనిద దప మగరిగరి
ప డవెక్కి బ ద్రా ద్రి పో దా మా

రి గ సా స రిమ పాప మగ రిగ రిప మగ సా
బ ద్రాద్రి రా ముణ్ణి చూ దా మా

## ౧౫. కేదారగౌళ-ఖండ-ఏక.

పాదపా మగరిగస రిరిమపా నిదపాప
యొంకివ స్తా దా ని యెదురుతె న్నులుకాసి

మపసాస నిదపాప మపద పా మ గ రి స స
దిగు లు ట్టి తల దించి తి రి గి సూ సే త లి కి

రీమపని స రి గసా ని స రి సా ని ద పామగరీ
యొంకిరా లి నా యెదర ని ల వా లి

రిమగసా రిమపాప నిదపమగ [3] రిగసా
కులుకు తా నం సేటూ పలకరిం చా లి

## ౧౬. నాదనామక్రియ-ఖండ-ఏక.

దపమగమ పామగమ పదదపమ పాపాప
ప ది మం ది లోయొం కి పా ట సే పాడంగ

మామమా మామమగమ పపదపమ గరిసాస
గో డ సా టు న యొం కి గుటక సే యే ళ

మామామ మామగమ పపదపమ గామగరీ సాని
సూ డా లి నా యొం కి సూ పు లా యే

సరి రిస నిని సారి సరిపమ మాపమగరి [3] గరిసా
సూ డా లి నాయొం కి సోద్దు మా యే ళ

## ౧౭. మాయామాళవగౌళ-ఖండ-ఏక.

సనిద సాస సారిసరి పదపమమ గరి రిస నీ
ప డు కుం టె నా కేటూ బ్రమ పు ట్టి నా దీ

రిసరి రిసనీ సస సరిమ మపమ గరి గరి రిససా
కడుపులో సె య్యే సి క లి పే సి నాదీ

పపమగమ పదపాప పధససా నిదపాప
ఎ డ తె గ ని జలమంట న డమ నో పడవం ట

మమనూమ మామగమ పపదపమ గరి గరిస
ప డ వె క్కి నా యెం కి ప య న మ య్యిందంట

## ౧౮. మధ్యమావతి-ఖండ-ఏక.

పనిసరిస ససాస నిసరిసా నిపమరీ
యెనకజె ల్మములోన యెవరమో నంటి

రిమరీస రిమపనిప పనిపమరి సరి రిస సా
సి గ్గొచ్చి న వ్వింది సిల కనా యెం కి

## ౧౯. మాండు-ఖండ-ఏక

సాస సస   సస సా రి   సని రిస నీదా   పదాపమా
నన్ను తలు   సుకుమెం కి   క న్ను మూ   యా లి

మరిమాప   దారిస నిదద   పాదప పమ మరి   పమమామా
క ను బొమ్మ   సూ   డా లి   క రి గి పో   వా   లి

దాదసస   సాసాస   సారిగసా   నిదదా
న న్ను క ల   లో సూసి   న వ్వు కో   వా లి

దద రిస రి   నిద దప ద   రిస నిద పమ   మరిమా
కను బొ మ్మ   సూ డా లి   కరు వు దీ   రా లి

## ౨౦. కాఫి-చాపుతాళం

గరి గరి గరి   గరి గరి గరి   పా పమ గరి   సరి రిసనీసా
మని సే సా   లు మని సి   మా టే   సా లు

(మ)
మరిమాపస ససా సనిదనిపా పపాదా పా మగరిగాగరిసని సా
మ ని సి వో సనే సా   లు మ న సే   సా   లు

పానీని   పరి రిసనీసా   సనీ సరి రిస   నినిద పమపా
ఏతాము   కెదు రు ం గ   యెం కుం టే   సా   లు

సాసససా   నిదాపాపా   మపా నిద దప   మగరిసనిసా
వొంటరి గ   సి టి కే సి   కు ం ట క లి   పే   ను

## ౨౧. సామ-ఖండ-ఏక.

రిమపదస దాపాప పామపద పమగరీ
దూ రా న నా రాజు కే రా యి డో నో

రిగసాస సరిమపద పామగరి సరిసా
యీరోజు నా రా త లే రా ల పా లో

పాదాసా దప మగగరిస రిమపదా దపదపప
సీ మ సిటు క నగా నె సెదరి పో తది మనసు

దరి సా స దాపాప మప దస దాపా పమగా గరిస
కా క మ్మ సే తై న కంబు రం ప డా రా జు

## ౨౨. ముఖారి-ఖండ-ఏక.

పద స నిద పా దద ప మప పమ గరిసా సాసా
ఉ త్త మా ఇ ల్లా లి నో యీ న న్

స రి గ రి స రీపమ మగగారీ రిస సా
నుసురు పె డి తే దో స మోయీ

పపదపమ మగరిసస సరిగరిస సాససస
నిదర లో నినుసూ సి సెదిరెనె మోమనసు

దససనా  సానీ నిదదప  పపదపమ  మప పద రిస
పారుగువో  రం తనా  సరసమరి  కా రం ట

సానీద
ఉ త్త మ ......

## ౧3. నాదనామక్రియ-ఖండ-ఏక

సారి పమ  గరి సరి గరి  సాసా సా
యొంకి తో  తీ ర్తా ని  కె ల్లా లీ

[ప్రతిచరణములోను చివరపాదము, అను పల్లవిమాదిరి; తక్కినవి పల్లవిమాదిరి.]

## ౧౪. మాయామాళవగౌళ-చాపు.

సాసా సా  నిదాపాపమ  గమా పదదపమా  గమగరిసనీ
నాప క్క  తి రి గి మా  టా డ  వా యొంకి

సరిగాసరి  గమాగారీ  ససా సా
యీసిక్క  నీ విప్ప  గల వా

దాపాదా నినీసాసా సనిగరిసా నిదానీసా
యీ జంట విడి పోయి యే వాడ నో తే లి

సాసాసా నిదాపమగమ పదాపామమ గపమగరిసని
యెంకిపా టిన గా నే యెదర నిలి నేదె వ రో

సాగాగమ పదాపామా గమగ రిసనీ
నా సూ పు సెద ర కొ ట్టె దెవరో

సాగాగమ పదాపామా గమగ రిసనీ
నాతో వ సదు ను సే సే దెవరో

నాపకర్మ

## ౨౫. కాఫి—ఖండ—ఏక.

రీ మ రి మ పాపాప మప మద ప పమగరిస
యీ యే పు నోయావు ఆ యే పు నో యా వు

రీమరిమ పప పపప మప పమగారీ స్నా సనిస
జోడా వు లకు నడుమ నా యెం కి యీడు

రీమరిమ పప పాప మప పమగారీ స్నా సనిస
జోడు గా నిలుసుంటె నా యెం కి ఆ ట

రీమపా పపపాప మాదప పమగారీ స్నా సారి
లాడ తా కలిసుంటె నా యెం కి న న్నె

నీ ని నీ సా సరి పమ గరి సా స్నా
సూడమ న్న ట్టుం డు నా యెం కి

## ౨౮. యమునాకల్యాణి–ఖండ-ఏక

సాసనిద    పాపమప    పనిదా దప పమ    గరిసనిద
సాశే    లానీ క    మా    శే    లా

దానిస రి    గ దప పమగారీ    స గరి రిసనిదరిస    స్సా
సి న్న త న    మే    లా    సి    గ్గే    లా

సాసాస    నిద దప పామా    పద నిద దప పమ    గరిసనిద
ఆ సీ మ    యీా సీ    మ    అం ద ర    ం    దా లు

దానీ రి    గ ద ప మ గ    రీ గరి రిసనిద    రిస సా
తిన్నంగ    ని ను సూ సె    ది ద్దు కు    ం    టా రు

## ౨౭. యమునాకల్యాణి–ఖండ-ఏక

దనిరిగమదప    పమ మగ గరి గరిరిస    సా
ఆ రి పే    య వె దీ పె    ము

నిసరిసనిద    పమగామ గమదమాపమ    గరిగారిససనిదా
వెలుగులో    నీ మీ ద    ని ల ప లే    సే    మ న సు

దానిదపమపా    దాదపమప పదరిస స సనిపద    దారిససాస
జి మ్మ మం    టాతో ట సీ    క పై    పో    వా లి

సాసారిస నిదదప మాపా దానిదదపమాపా మగగరిరిససనినిద
సీ క ట్లో సూ డా లి నీ క ళ్ల త ళ త ళ లు

ఆరిపే

## ౨౮. యమునాకల్యాణి-ఖండ-ఏక

దసరిగ గదప పమ గరి సరిసనిదద ద గరి రిససాసా
అద్దమే లం టా ది అందా లు తె ల ప

గగగా గగరిగప పదసదదపపమ గరి సనిదా
ముద్దుమా టలకెంకి దే ముందు న డ క

గగరిగ గదప పాప మపదాద పా నిద దప పాపా
కం టెదర్గ నా కా డ క ని పా ప లో నీ డ

గగ గా గగగరిగ గదపామ గరి రిస సీదా
సూసుకొం ట్గా నొసట సుక్కెట్టు కుం టా ది

## ౨౯. ఆనందభైరవి-మిశ్రచాపు

పాప పమగరిసా సరిపమగారి సానిసగారి గామా
యెక్క వే కొండ నెక్క వే నాసక్క నెం కీ ఎక్కవే

పాసాసానిదా పాపమా గమ పాపమగరీ గమపమ
పక్కసూపులు మాని పై కె ల్లి పో దా ము ఎక్కవే

గమ పాపమగరీ $\overset{3}{\text{సా}}$సానిస గారిగమపా పపపా
ముం దు ను వ్వుం జేసే కిం దా ని ల బ డ గ ల ను

పా $\overset{3}{\text{సా}}$సరిసనీదా పాపమగమా పాపమగరీ గామామ
నీ నీ డనె తొక్కు కొ నిసులువు గ రాగల నెక్కవే

## ౩౦. హిందుస్థానితోడి-ఖండ-ఏక.

పాదపమ గాగగమ పదనిదమ గరిసనిదపదా
గో వుమా ల చ్చి మి కి కో టి దం ణ్ణా లు

సరి గమపదనిద దపమా గరిసారీ గమపాపమ గరి సరి గరి$\overset{3}{\text{సా}}$
మని సి కై నా లే ని మం చి పో కి ళ్లు

యిందు చరణములన్నియు పల్లవిమాదిరియే;

## ౩౧. మాయామాళవగౌళ-ఖండ-ఏక

పాదదపమా గరిరిసరి సరిపమగరిగరి సస$\overset{3}{\text{సా}}$
ఆ ప లే నేయెం కి యీ పడ వ యిసురు

సరిమమా మామగమ పపదపమ గరిగామ
పా డ లే నే యెం కి ప ద ము లీ రోద లో

పదప మగమా పదనిద దపపాపా పద ని సస నిద పదపదమా
పడ వ స ల్ల గ న డి పి పద ము సదు వం టా వు

సమ్మమా మామగమ పాదపమ గరిగామ
కస్సుమం టా యే రు గాలి నెగ బో సిం ది ఆప

## 3౨. దేవగాంధారి-ఖండ-ఏక

దానసస దాపాప పాప పదనిద మపదప మగరి
అద్దములో నా రా జ అంత నీ రూ పు

రీ రి రీ దప దపమగరీ సరి గ రిస నిద రిపసా సా
యింతము త్తెములో న యిరికె నే లా గు

## 33. ముఖారి-ఖండ-ఏక

పద సా స రిసీ నిద దాపా మపదపమ మగగరిస
ఆ నా టి నా వో డు సెం దు రూ డా

సరిగ రిసరి రిపమా మగగారీ సరిగ రిస సా
అలి గిరా తే దో యి సెందు రూ డా

మప నిద దప పమ మగ గరిస సరి మగ రిస రిస సాస
యెం కి మ న మి ద్దరమె యె వ్వ రో ద్ద న్నాడు

పదసాస   సరిసీ నిదదాపా   పాదపమ   గరిమామ
యీానే లు   యీా తో   ట   లింక నీ   వ న్నా డు

ఆనాటి

## ౩౮. మోహన-ఖండ-ఏక

ద సా రి   గాదప పగరి   సాసద పాదరి   సాసా
సుక్కా-క్కా   డు   న్నాదొ   సూ డ   వే   చె ల్లీ

సరిగాగా   గగ గరిగ   పపసదప   దపగరిరి
బా ర డై   నా కొండ   పయికిసా   గిందేమొ

గగరిగ   గదపపప   గదదదా   పాసధ దపపాపా
తానునిలి   పి నగద్దువు   దా టి పో   నే   లే   దు

సరిగా గా   గగ గరిగ   పదసదప   దప గ రిరి
కా లు నే   తులు పక్కా   కం టుకొని   పో నాయి

సుక్కా

## ౩౯. శహన-ఖండ-ఏక.

నిస రిగారి   రిరిరీరి   రిగ మప పమమా   గమ గమ రిగ గరిసా
ఉ త్తమా   ట లు నీవి   పొంమ్మం ది   రా   యెం   కి

నిని సామగ  రిససా సనిదాదానిద పామా  దాదనిసాసనిసా
కొ త్తపా  ట  లు  పా  డు  కొ మ్మ ం ది రా

పద పా$^{3}$ద పా$^{3}$ద పమమా  దద నిని సాసా
పూ రె  త్త  న ని ప లి కి

నిని సామగరీ  సారిస నిస దా దానిదపా
మా రే  స మే  సు  కు  ని

దని సరిరిస సా  నిసదా దానిద పాపా
సకి నా  ల  పా  టో  చ్చు

రిగమా పాదని  దపమా గమగమ రీగరి సా
సకి న  మ  డు  గం  న్నా  ను

ఉత్తమాట.

---